## మహా మానవవాద తత్వవేత్త

# మానవేంద్రనాథ్ రాయ్

(135వ జయంతి ప్రచురణ)



ప్రత్యామ్నాయ సాంస్కృతిక సమాఖ్య
ఆంధ్రప్రదేశ్ - తెలంగాణ

# మహా మానవవాద తత్వవేత్త
# మానవేంద్రనాథ్ రాయ్
## (135వ జయంతి ప్రచురణ)

రచన
**గౌరవ్**



ప్రచురణ
మార్చి, 2022
(ఎం.ఎన్.రాయ్ 135వ జయంతి సందర్భంగా)

ప్రతిపాదిత విరాళం
ఐచ్ఛికం

ప్రతులకు
9032094492

వివరాలకు
gouravmeka@gmail.com



## అంకితం



**శిబ్‌నారాయణ్ రే**
(1921–2008)

**సత్యజిత్ రే**
(1921–1992)

**భారతీయ సాంస్కృతిక వికాసానికి మానవీయ సౌరభాలతో కూడిన సారస్వత విలువల్ని సారవంతంగా అందించీ, జీవితాంతం జనశ్రేయస్సు కోసం అవిశ్రాంతంగా తపించి కనీసం శతజయంత్యుత్సవాలకి కూడా నోచుకోని విస్మృత దార్శనికులుగా మిగిలిపోయిన ఇరువురు బెంగాల్ యోధులకి, వారి అజరామర గాథలకి సగౌరవంగా....**

# సూచిక


1. ప్రస్తావన 4
2. మహా మానవవాద తత్వవేత్త మానవేంద్రనాథ రాయ్ 5
3. మరుగునపడ్డ మహామానవుడు మానవేంద్రనాథ రాయ్ 11
4. ఆంటోనియో గ్రాంస్కీ – ఎమ్.ఎన్. రాయ్ కొన్ని జ్ఞాపకాలు 14
5. అవిశ్రాంత యోధుడి చివరి మజిలీ!
6. ఇండియన్ రినైజాన్స్ ఇనిస్టిట్యూట్ (హ్యూమనిస్ట్ హోమ్) 17
7. అద్వితీయమైన వైజ్ఞానిక సంస్థకి అమృతోత్సవం!
   భారతీయ సాంస్కృతిక పునర్వికాస కేంద్రం!!
   (ఇండియన్ రినైజాన్స్ ఇనిస్టిట్యూట్) 19
8. ముగింపు 22

# ప్రస్తావన

మహా మానవుడు మానవేంద్రనాథరాయ్ 135వ జయంతిని పురస్కరించుకుని తీసుకువస్తున్న పొత్తమిది. అడపాదడపా రాయ్‌ని గురించి సామాజిక మాధ్యమాల్లో రాసిన రైటప్‌లని ఈ విధంగా ఒక్కదరికి చేర్చడం జరిగింది. రాయిని గురించి అభిమానంతో రాసినవే కాని సాధికారక శోధన ఏదీ నేను చేయలేదు. ఆ మాటకొస్తే ఇవి సందర్భోచితంగా రాసిన స్పందనలేగాని సమగ్రాలసలు కానేకాదు.

ఒకనాడు దేశమంతటా క్రియాశీలకంగా అనేక ప్రాంతాలలో పనిచేసిన రాడికల్ హ్యూమనిస్ట్ ఉద్యమం ఈరోజు లేదు. తెలుగులో కూడా గతంతో పోల్చి చూస్తే యువతరం ఎక్కువమంది లేరు. మానవవాద ఉద్యమం సంగతి అలా వుంచితే మహోన్నత మానవుడిగా మానవేంద్రరాయ్ సైతం విస్మరణకి లోనయిన దశలో మనమున్నాం.

ఆ క్రమంలో ఒక సుస్థిరమయిన సాంస్కృతిక వికాసోద్యమ కొనసాగింపుకి మద్దతుగా భిన్నాభిప్రాయాన్ని గౌరవిస్తూనే రాయ్ కృషికి సరైన మదింపు వేయడం అవసరమని నా అభిప్రాయం. అందులో భాగమే రాయ్ కృషిని సగౌరవంగా స్మరించుకునే ఈ సందర్భం. అభిప్రాయ భేదాలు ఎలాగూ ఉంటాయి. కాని ఆలోచనాపరుల్ని మల్చుకోవడమే ప్రజాతంత్ర ఉద్యమాలకి మిగిలి ఉన్న ఏకైక ప్రత్యామ్నాయం.

పదేళ్ళ క్రితం తెలుగులో మొదటి కరపత్రాల సంపుటిగా ప్రచురించబడిన నా 'కరపత్రాల కథా కమామీషు" పుస్తకంలో రాయ్ గురించిన కరపత్రం ఉంది. తెలంగాణ నుండి వెలువడిన 'భౌతికవాది' ప్రారంభ సంచికలో కూడా అదే పునర్ముద్రించారు. ఇక రాయ్ రచన Cultural requisites of freedom ని 'సాంస్కృతిక ఆవశ్యకతగా స్వేచ్ఛ' గా అనువాదం చేసిన విషయం మిత్రులకి విధితమే.

అలాగే ఆ మధ్య యం.యన్. రాయ్ విశిష్ట రచన "Humanism Revivalism and The Indian Heritage" లోని కొంత భాగాన్ని తెలుగులోకి తీసుకువద్దామని మొదలుపెట్టానుగానీ అనేక కారణాల వల్ల అది కార్య రూపం దాల్చలేదు. ప్రస్తుతానికి, అందుకే రాయ్ జీవితం కృషికి సంబంధించిన ఈ రైటప్‌లనిలా మీ ముందుకు తీసుకువస్తున్నాము.

విమర్శలకు ఆహ్వానం.

# మహా మానవవాద తత్త్వవేత్త
# మానవేంద్రనాథ రాయ్

"సజీవుల్లో రాయ్ అంత విస్తృతంగా ఆసియా విప్లవంలో పాల్గొన్న వాడెవ్వడూ లేడు. 20 సంవత్సరాల క్రితం రాయ్‌ని గురించి చెప్పాలంటే, మూర్తీభవించిన ఆసియా విప్లవంగా చెప్పవచ్చు."

**– గుయ్ వింట్**

***

"ఆ రోజుల్లో రాయ్ స్థానాన్ని ఆక్రమించగల వారెవ్వరూ లేరు.... ఆయన మహాశక్తి సంపన్నుడు. విద్వాంసుడు. విస్తృతంగా రాసాడు. భారత కమ్యూనిస్టు నాయకుల్లో ఈ ప్రధాన లక్షణాలు లేకపోవడం కొట్టొచ్చినట్లు కనిపిస్తుంది."

**– లిబరేషన్** (నక్సల్బరీ గ్రూపు మాసపత్రిక)

***

"1920 ప్రారంభంలో ఇండియాలో కానీ తాష్కెంట్‌లో కానీ భారత కమ్యూనిస్టు పార్టీ ఏర్పడలేదు. కమ్యూనిస్టు పార్టీ సభ్యుడు అనే అర్థంలో, మెక్సికో కమ్యూనిస్టు పార్టీ సభ్యుడిగా రాయ్ ఒక్కడే కమ్యూనిస్టు. అప్పటికే కమ్యూనిజాన్ని గురించి ఆయన లోతుగా అవగాహన చేసుకున్నాడు."

**– జి.ఎం. అధికారి**

***

"ఆ విజ్ఞానం, అవగాహన, ఆ ధైర్యం స్థైర్యం, అంత సహనం, తులనాత్మక, ఎక్కడో కల్పనా సాహిత్యం లో తప్ప చూసే అదృష్టం మాకు లేదు. అద్భుతమైన నీ అనన్యతలో రహస్యమేమిటా అని నేను విస్తుపోతూ ఉంటాను. అవకాశవాదిగా వుండటమంటే ఏమిటో నీవింకా నేర్చుకోలేదు. నీవు ఆశావాదివి..."

**– సురేంద్రనాథ్ దత్తా** (రాయ్‌కి రాసిన లేఖలో)

***

“వీరోచిత కార్యాలు ప్రదర్శిస్తూ విదేశాలకు తప్పించుకుపోయి భారత స్వాతంత్ర్యం కోసం విదేశాలలో పోరాడుతున్న విప్లవకారుల్లో నూరుగాథల కథానాయకుడైన ఎం.ఎన్.రాయ్ లాగా మా విస్మయాన్ని చూరగొన్నవాడు మరొకడు లేడు.”

**– శిశిరకుమార ముఖర్జీ**

***

“ఆయన జీవించింది ఒక్క జీవితమేనా?అనేక జీవితాలా? ఈ క్షణంలో ఆర్కిటిక్ వలయం కింద తిరిగి దానికెదురుగా ఎక్కడో ధృవశీతలంలో మరో క్షణంలో అత్యుష్ణ భూమధ్య రేఖామండలం దగ్గర ఇలా కన్పించి అలా మాయమయ్యే తిమింగలం లాగా రాయ్ తన విప్లవ జ్వాలల్ని బెంగాల్‌లో, మెక్సికోలో, రష్యాలో, చైనాలో వెలిగించుకొంటూ పోయాడు. ఆయన అద్భుత చేష్టలింకా పూర్తి కానే లేదు.”

**– ఆచార్య శ్రీనివాస్ అయ్యంగార్**

***

“విజ్ఞానాన్నంతా తన సొత్తు చేసుకున్నవాడు ఎం.ఎన్. రాయ్. నిరంతర విప్లవ కార్యాల్లో నిమగ్నమై ఉండి కూడా అన్ని శాఖల్లో అన్ని భాషల్లో ఎప్పుడు ఎలా అంత ప్రావీణ్యత సంపాదించగలిగాడో – ఆ విషయం ఎన్నటికీ ఆశ్చర్యంగానే మిగిలి పోతుంది. ఆయన మహా పండితుడు, గొప్ప భాషావేత్త, జన్మతః విప్లవకారుడు, సునిశిత సిద్ధాంత కర్త, బ్రహ్మాండమైన మేధావి, అచంచల హేతువాది, స్థితప్రజ్ఞుడు. విప్లవ చైతన్యం కల రాజకీయ నైతిక వైరుధ్యాలతో సంక్షుభితమైన యుగంలో విశ్రాంతి ఎరగకుండా కృషి చేసిన ఉత్తమ పురుషుల్లో రాయ్ ఒకడు.”

**– ఆచార్య నిర్మలచంద్ర భట్టాచార్య**

***

“1920 లో మేము రష్యా చేరేటప్పటికే తాష్కెంటులో రాయ్ సర్వాధికారి.”

**– షౌకత్ ఉస్మానీ**

***

“అసంతృప్తులైన భారత మేధావుల్లో కొందరికి సోషలిస్ట్ సిద్ధాంతాన్ని కార్యాచరణను పరిచయం చేసి వారిని పూర్తిగా మార్క్సిజంలోకి మార్చడంలో ఎం.ఎన్.రాయ్ కృతకృత్యుడైనాడు. వ్యవస్థాపరంగా కమ్యూనిస్టు ఇంటర్నేషనల్‌కి, అప్పుడే ఆవిర్భవిస్తున్న కమ్యూనిజానికి ఎం.ఎన్. రాయ్ మొదటి సంధానకర్త.”

**– డి.సి. గ్రోవర్**

***

“రాయ్ని గురించి వాడని రాజకీయ సమాసం లేదు. ఉద్దండ పిండం, కొరకరాని కొయ్య – అని ఆయన్ని ఏమేమో అన్నారు. ఆయన అందరి జుట్టుల్లో గుండానూ వెళ్ళాడు. సింహం జూలు మొదలు బ్రాహ్మడి పిలక వరకు ఆయన పట్టించుకోని విషయమూ, విమర్శించని విషయమూ లేదు. దేనికీ జంకి కానీ ఎవరనీ లెక్కచేసి కానీ ఎరగడు. ఆయన నిజాయితీ పునాదులు చాలా బలమైనవి. వజ్రాలయినా దొరుకుతాయి కానీ నిజాయితీ బలంగల భారత రాజకీయవేత్తలు దొరకడం కష్టం.”

**– బెవర్లీ నికోలస్**

***

“పారిశ్రామికీకరణ పొందిన ప్రాంతాలకు కాకుండా ప్రపంచంలో అభివృద్ధి చెందని దేశాలకు కమ్యూనిస్టు విధానాన్ని అభివృద్ధి పరచడంలో రాయ్ లెనిన్, మావోల శ్రేణిలో ఉంటాడనడం అతిశయోక్తి కాదు....”

**– ఫిలిప్ శ్ప్రాట్**

***

“బెంగాల్ విప్లవకారుల్లో ఎవరి మీదనైనా నాకు నిజమైన గౌరవం వున్నదంటే అది ఒక్క యం.యన్.రాయ్ మీద మాత్రమే.”

**– లాలాలజపతి రాయ్**

***

మహా విప్లవకారుడైన మానవేంద్రనాథ రాయ్ వర్ధంతి ఈరోజు. ఆయన గురించి పరిచయం చేయడమంటే ఆకాశపు అంచుల్ని, సముద్రపు లోతుల్ని అక్షరాల్లో ఇమడ్చాలని ప్రయత్నించడమే!

రాయ్ జైల్లో ఉన్నప్పుడు ఐన్‌స్టీన్ అంతటి శాస్త్రజ్ఞుడే స్వయంగా రాయ్‌ని విడుదల చేయాలంటూ బ్రిటిష్ ప్రభుత్వానికి లేఖ రాసాడని ఊహించగలమా?

సాక్షాత్తూ ఐక్యరాజ్యసమితి అంతర్జాతీయ సాంస్కృతిక శాఖ UNESCO అధినేత జూలియన్ హాక్సీ ప్రపంచ మానవవాద సంఘం ఏర్పాటుకు గాను రాయ్‌ని ఆహ్వానించాడని విని విస్తుపోకుండా ఉండగలమా?

"ప్రమాద భూయిష్టమైన సాహసోపేత జీవితాన్ని గడపడంలో రాయ్‌తో పోల్చదగ్గవారు ఇటీవలి కాలపు భారతీయుల్లో లేరు. నేతాజీ కూడా ఆయనకు తీసికట్టే..." అన్న లోక్నాయక్ జయప్రకాశ్ నారాయణ్, రాయ్ మరణించినప్పుడు, "రాయ్ మరణంతో భారతదేశమే కాదు, ఆసియాయే ఒక మహానాయకుడ్ని కోల్పోయింది..." అంటారు.

ప్రపంచంలో మొట్టమొదటి నవీన మానవవాద సిద్ధాంతకర్తగా ఆయన స్థానం అజరామరం. అందుకే నెహ్రూ నుండి లెనిన్ వరకూ, స్టాలిన్ నుండి బోస్ దాకా ఆయన జీవితం పట్ల విస్మయం చెందని నేత ఒక్కరు కూడా లేరు.

"రాయ్ వీరాధివీరులకు వీరుడు. విప్లవకారులకు నిరంతర విప్లవమూర్తి. జిజ్ఞాసువులకు జిజ్ఞాసా తపస్వి. తత్వవేత్తలకు మానవవాద స్రష్ట. అన్నింటినీ మించి సంపూర్ణ మానవత్వం వైపు చాలా దూరం పయనించిన మనిషి – కాదు మనీషి – మహా మనీషి యం.యన్. రాయ్" అంటారు తెలుగులో రాయ్‌ని గురించి విస్తృతంగా పరిచయం చేసి వందకు పైగా గ్రంథాలు రాసిన మిత్రులు, వందేళ్ళ రాయిస్టు, రావిపూడి వెంకటాద్రి గారు.

రాయ్ శతజయంతి ఉత్సవాలు తెనాలిలో ఘనంగా నిర్వహించిన సందర్భంలో ఆయన గురించి చిన్న పొత్తం ఎం.వి. రమణయ్య ప్రచురించారు. అందులో రాయ్ గురించి జి.కృష్ణ అనే జర్నలిస్టు రాసిన దాన్ని ఉదహరిస్తూ,

“రాయ్ గారిలో పెద్ద లోపం ఆయన క్షుణ్ణంగా చదువుకోవడం. చదివిన దానిని అనుభవ పూర్వకంగా ఆలోచించుకోవడం. విమర్శగా అర్థం చేసుకుని దేశకాల పరిస్థితులకు అన్వయించుకొనడం. అందువల్ల పలువురు రాజకీయ వాదులకు ఆయనంటే ఇష్టం లేదని తేల్చుకున్నాను.” అంటూ,

“నినాదాల నల్లమందు ఎక్కించే ఈ రోజుల్లో ప్రజల్ని వివేకవంతుల్ని చేసే కృషి జరగాలన్న రాయ్ వాదాన్ని ఎంతమంది అంగీకరించగలరు?..” అని ప్రచురించారు. నేటికీ నిజమే అనిపిస్తుంది.

మొట్టమొదటి భారత రాజ్యాంగ చిత్తుప్రతిని రాసి ప్రకటించిన రాయ్, అందులో మొదటి ఆర్టికల్‌లోనే

“The people have the inalienable right to alter and modify the political organization of Society.”

“The right of Revolt against tyranny and oppression is sacred”

అంటూ నియంతృత్వం పై ప్రజలకు తిరుగుబాటు హక్కును రాజ్యాంగంలో కల్పించాలంటాడు. ప్రపంచంలో ఏ రాజ్యాంగ నిర్మాతా కనీసం ఊహించని సూత్రమిది.

“ఇంతగా వీరపూజకు అంకితమైన ఈ దేశంలో జనం ద ృష్టిలో రాయ్ ఆరాధ్యుడు కాకపోవడం విడ్డూరం.” అంటాడు ఫిలిప్ స్ప్రాట్. నిజమే, ఆయన జీవితం గురించి చేసిన కృషి గురించి ఈ దేశ ప్రజలకు తెల్సింది చాలా తక్కువ.

ఆయన పుట్టిన బెంగాల్ మొదలుకొని నడయాడిన దేశంలోని ప్రతీ ప్రాంతంలో ఈ రోజు ఆయన పేరు బొత్తిగా అపరిచితం. ఎంతో గొప్ప ఆశావాద దృక్పథంతో డెహ్రాడూన్‌లో రాయ్ స్థాపించిన “ఇండియన్ రినైజాన్స్ ఇనిస్టిట్యూట్” (భారత సాంస్కృతిక పునరుజ్జీవన కేంద్రం) కూడా పూర్తిగా నిష్క్రియాపరంగా ఉంది. ఆయన సమాధిని కూడా నాశనం చేసుకున్న ఘనత మనది.

ప్రపంచంలోనే మొట్టమొదటి రష్యనేతర కమ్యూనిస్టు పార్టీ స్థాపకుడిగా, భారత కమ్యూనిస్టు పార్టీ స్థాపకుడిగా, కాంగ్రెస్ చరిత్రలో మొదటిసారి Radical-ismని చేర్చి లీగ్ ఆఫ్ రాడికల్ కాంగ్రెస్ మేన్ పెట్టినవాడిగా, రాడికల్ డెమోక్రటిక్ పార్టీ స్థాపకుడిగా, రాడికల్ హ్యూమనిస్ట్ గా ఆయన నిర్వహించిన పాత్రలు అనితర సాధ్యం.

ఏదేమైనా, నవ్య మానవవాద దిక్సూచిగా రాయ్ జీవితం, కృషి సత్యాన్వేషకులు అందరికీ ఒక నిత్య పాఠ్యాంశం. జె.పి. అన్నట్లు,

"అంతా నాటకంలాగా విజయ పరంపరలతో స్వార్థరహితమైన అంకిత భావంతో గడచిన ఆయన జీవితం భవిష్యత్ తరతరాలవారికి ఉత్తేజం ఇస్తూనే ఉంటుంది. రాజకీయ, సామాజిక ఆలోచనా రంగాల్లో ఆయన చేసిన మార్గదర్శక కృషి జాతీయ– అంతర్జాతీయ అధికార రాజకీయ రంగంలో కమ్ముకున్న అంధకారం గుండా దూసుకువచ్చే కాంతిపుంజాలను మనకు ప్రసరింపజేస్తుంది."

**(కొటేషన్స్ కర్టసీ : రావిపూడి వెంకటాద్రి రచన మహామనీషి ఎం.ఎన్.రాయ్ గ్రంథం నుండి)**

జనవరి 25, రాయి వర్ధంతి సందర్భంగా
మహావ్యక్తిని స్మరించుకుంటూ రాసిన రైటప్

***

# మరుగునపడ్డ మహామానవుడు
# మానవేంద్రనాథ రాయ్

బాల్యం నుండే నన్ను ప్రభావితం చేసిన వ్యక్తుల్లో యం.యన్. రాయ్ ఒకడు. తన జీవితంతో ఎప్పటికీ విస్మయానికి గురిచేసే తిరుగులేని విప్లవకారుడు, తన రచనలతో మూఢత్వాల్ని చీల్చి చెండాడిన క్రియాశీల తిరుగుబాటుదారుడు, తత్వశాస్త్రానికే కొత్త మార్గం చూపిన మానవవాద ధీరుడు.

భౌతికవాద దృక్పథంతో భారతీయ చరిత్రనీ, ఆ మాటకొస్తే ప్రపంచ గతినీ అంచనా వేసే స్థాయి ఉన్న అతి కొద్దిమంది అరుదైన దార్శనికుల కోవకు చెందినవాడు రాయ్. దేశవ్యాప్తంగా ఏవో ఒకట్రెండు రాడికల్ హ్యూమనిస్ట్ సంఘాలేకానీ ఆయన కోసం తెల్సిన వారు తక్కువ.

తీవ్ర జాతీయవాదిగా, సాయుధ వీరుడిగా ప్రపంచంలోనే మొట్టమొదటి రష్యనేతర మెక్సికన్ కమ్యూనిస్టు పార్టీ స్థాపకుడిగా, భారత కమ్యూనిస్టు పార్టీ స్థాపకుడిగా, జాతీయ కాంగ్రెస్ పార్టీలో సైతం రాడికల్ వింగ్‌ని పెట్టినవాడుగా, రాడికల్ డెమోక్రటిక్ పార్టీ స్థాపకుడిగా అంతిమంగా రాడికల్ హ్యూమనిస్ట్ ఉద్యమ వ్యవస్థాపకుడిగా ఆయన నిర్వహించిన పురోగామి పాత్రలు అనేకం, అనితర సాధ్యం.

దాదాపు పదిహేనేళ్ళ క్రితం నేను  రాసి ప్రచురించిన ఎం.ఎన్. రాయ్ కరపత్రం రాష్ట్రంలో పేరొందిన రాయిస్టు రావిపూడి వెంకటాద్రి మొదలు ఎంతో మంది పెద్దలు ఆనాడే స్పందించి అభినందించడం గుర్తు నాకు. ఏడేళ్ళ క్రితం డా. మలయశ్రీ సంపాదకుడిగా తెలంగాణ, కరీంనగర్ నుండి ప్రారంభమైన "భౌతికవాది" పత్రిక ప్రారంభ సంచికలో కూడా ప్రచురించిన ఏకైక కరపత్ర వ్యాసం అది.

మూడేళ్ళ క్రితం సుందర్లాల్ బహుగుణ ఇంటర్వ్యూ కోసం డెహ్రాడూన్ వెళ్ళినప్పుడే రాయ్ భారతీయ సాంస్కృతిక పునరుజ్జీవనం కోసం ఎంతో ఆశతో స్థాపించిన "Indian Renaissance Institute" చూసాను. అది స్థాపిస్తూ Educate the Educators అంటాడు రాయ్.  కోల్‌కతాలో భాస్కర్ సూర్ బలవంతం మేరకు Cultural requisites of Freedom వ్యాసాన్ని కూడా 2017లో  తెలుగు చేసాను.

డెహ్రాడూన్‌లోని రాయ్ మొత్తం సరంజామాని నాశనం చేసారు. సమాధిని మాయం చేసారు. ఈ దేశపు ఔన్నత్యాన్ని ప్రపంచానికి ఎలుగెత్తి చాటి మూడు



(మే 1979లో డెహ్రాడూన్‌లో ఎం.ఎన్. రాయ్ సమాధి వద్ద తండ్రి అస్థికలు నిక్షిప్తం చేస్తున్న 'వరద', పక్కన ఉన్నది రాయిస్ట్ మిత్రుడు ఆర్.ఎమ్. పాల్!



ఎమ్మెన్ రాయ్ సమాధి వద్ద డా॥ ఆర్.ఎం. పాల్‌తో మాట్లాడుతున్న ఎ.వి.రాజేశ్వరరావు

ముఖ్య ఖండాల రాజకీయ కార్యకలాపాల్లో వెనుదీయని నాయకుడిగా ఎదిగిన రాయ్‌తో సరితూగగల వ్యక్తి ప్రపంచ చరిత్రలోనే అరుదు. అలాంటి వ్యక్తి గురించి ఆయన సమకాలీన చరిత్ర న్యాయం చేయలేదు, మన కాలంలో కూడా అంతటి నాయకుడికి సముచిత స్థానం ఇవ్వలేదు.

మరో ముఖ్యమైన విషయం ఏమిటంటే తెలుగులో బహుముఖ మేధావి, ఆధునిక కవిత్వ త్రయంలో గురజాడ అప్పారావు, రాయప్రోలు సుబ్బారావుల తరువాత

స్థానంలో ఉన్న అబ్బూరి రామకృష్ణ రావు గారు తన మరణానంతరం అస్తికల్ని డెహ్రాడూన్‌లోని రాయ్ సమాధి దగ్గరే కలపమన్నారు. ఆ విషయాన్ని గతంలో మిత్రులు టి. రవిచంద్ నాకు తెలియజేయడం జరిగింది. ఇన్నయ్యగారు కూడా సామాజిక మాధ్యమాల్లో దీని సంబంధమై వ్యాసం రాసినట్లు గుర్తు. రాయ్ సమాధితో పాటు తెలుగు సమాజానికి సాంస్కృతిక ప్రాధాన్యత కల అబ్బూరి వారి అంశం కూడా దీనితో ముడిపడి ఉందని తెలుగు సమాజంలోని బుద్ధిజీవులు గుర్తించాలి.

నా ప్రారంభ రచనల్లో రాయ్ని తీవ్రంగా విమర్శించిన సందర్భాలు ఉన్నాయి. భావజాలంతో విభేదించడం భావాల ఔన్నత్యాన్ని గుర్తింక పోవడం కారాదు. ఈ రోజు రాయ్ త్యాగాన్ని, కృషినీ గుర్తించడంలో ప్రగతిశీల సంఘాలకి అనేక నామోషీలు ఉండొచ్చుగానీ, అంతిమంగా ఆయన పక్షం కూడా అణగారిన మనిషి కోసమేననే స్పృహ ఉంటే భారతీయ కమ్యూనిస్టు పార్టీ పితామహుడిగా ఎవరొప్పుకున్నా, లేకున్నా ఆయన స్థానం చిరస్థాయిదని గుర్తించడం నిజాయితీ అవుతుంది.

(1920లో రాయ్ ఆధ్వర్యంలో తాష్కెంట్‌లో భారత కమ్యూనిస్టు పార్టీ ఏర్పడి 100 సంవత్సరాలు పూర్తైన సందర్భంగా ఈ చిన్ని రైటప్....)

***

# ఆంటోనియో గ్రాంస్కీ - ఎమ్.ఎన్. రాయ్

## కొన్ని జ్ఞాపకాలు



గ్రాంస్కీ అనగానే Prison Notebooks గుర్తొస్తాయ్. ఫాసిజపు దుర్మార్గానికి చిన్న వయసులోనే బలైపోయిన తొలి వ్యక్తులలో ఆంటోనియో గ్రాంస్కీ ఒకరు. అంతేకాదు మార్క్సిజాన్ని వినూత్నమైన రీతిలో అర్థం చేసుకుని తాత్వికంగా విశేష కృషి చేసిన అనితరసాధ్యమైన కమ్యూనిస్టు గ్రాంస్కీ.

స్వాతంత్రోద్యమ కాలంలో గాంధియన్ విధానాల పట్ల అధ్యయనం చేసిన గ్రాంస్కీ మార్క్సిజానికి సంబంధించిన తన దృక్పధాన్ని మార్చుకున్నాడనే వాదనుంది. (ఇదెంత సరైందో అధ్యయనశీలురు చెప్పాలి) ఐతే, ఇండియన్ మార్క్సిస్టుల్లో గ్రాంస్కీ పట్ల అవగాహన కలిగి ఉన్నది విలక్షణ కమ్యూనిస్టు మోహిత్సేన్, చరిత్రకారుడు బిపిన్ చంద్ర వంటి కొద్దిమంది మాత్రమే.

ఒక ఆసక్తికరమైన విషయం ప్రస్తావించాలి. ఈరోజు అంతర్జాతీయంగా గ్రాంస్కీ మీద అనేక అధ్యాయాలు జరుగుతున్నాయి. కానీ, అసలు గ్రాంస్కీ ప్రపంచానికి తెలీక మునుపే అతడి ప్రాముఖ్యతని బలంగా గుర్తించిన వ్యక్తి ఎం.ఎన్. రాయ్. గ్రాంస్కీని తత్వ విజ్ఞాన శాస్త్రానికి ఎంతో గొప్ప దోహదం చేసిన మేధావిగా పేర్కొన్నాడు.

గుంటూరులో కొన్నేళ్ళ క్రితం జరిగిన ఇంటూరు సాంబశివరావు అనే భావోద్యమకారుని సంస్మరణ సభ రిపోర్టుకి సంబంధించిన వార్త హేతువాది పత్రికలో వచ్చింది. అది తెలుపుతూ మిత్రులు రవిచంద్ గారు గ్రాంస్కీ గురించి తన ప్రసంగంలో ప్రస్తావించినట్లు ఉంది. అది చూసి నేనాయనకి లేఖ రాయగా అనేక విషయాలతోపాటు పై విషయాన్ని గురించి కూడా ప్రస్తావిస్తూ జవాబు రాసారు.

యం.యన్.రాయ్ తన స్మృతులు (Memoirs) లోని 37 వ అధ్యాయం The old guard of German Communismలో ఈ విషయాన్ని ప్రస్తావిస్తూ, It was a curious coincidence that there was another hunchback amongst the most outstanding communist leaders. It was Antonio Gramsci of Italy. I met him in Moscow. He was not a worker, but an intellectual, a professor of philosophy. He also was shy. Arrested in the earlier years of the fascist regime, he spent twenty two years in prison, and died soon after his release, on liberation of Italy. The hardship of long imprisonment had shattered his delicate health, but could not daunt his spirit... అంటాడు.

అంతేకాదు, Gramsci came to the conclusion that the philosophical aspect of Marxism should be revised ....... Gramsci had left behind about 2000 pages of manuscript as a result of a profound study in prison. It may turn out to be the greatest contribution to the philosophical thought hitherto made by any communist అంటాడు.

"ఇప్పుటి వరకూ ఏ కమ్యూనిస్టూ కూడా అందించని అత్యున్నత కృషి ఇది" అని గ్రాంస్కీ కృషిని కొనియాడాడు రాయ్.

గ్రాంస్కీ సిద్ధాంతీకరించిన cultural hegemonyని కూడా లోతుగా అర్ధం చేసుకోబట్టే సాంస్కృతిక వికాసోద్యమ ప్రాధాన్యతను గుర్తించి Indian Renaissance Institute రాయ్ స్థాపించాడనేది నా అభిప్రాయం. తర్వాత కాలంలో గ్రాంస్కీని అంబేద్కర్‌తో సహా పోలుస్తూ అనేక అధ్యయనాలు చేసారు (కొన్ని అంతర్జాలంలో కూడా ఉన్నాయి) కానీ, సాంస్కృతిక ఆధిపత్యాన్ని గురించి గ్రాంస్కీ సూత్రీకరణలపై ఎప్పటికంటే ఈరోజు అధ్యయనం, చర్చ జరగాల్సిన అవసరం మరింత ఎక్కువ ఉందనేది నా అభిప్రాయం.

Organic intellectuals ని స్వతంత్ర ఆలోచనాపరుల్ని మల్చుకోవాల్సిన బాధ్యత ను గుర్తించిన మొదటి తరం కమ్యూనిస్టు ఉద్యమకారుల్లో గ్రాంస్కీ ఒకరు. కమ్యూనిస్టేతర అభ్యుదయపు అస్తిత్వాన్ని కూడా సగౌరవంగా గుర్తించి అదెంత అవసరమో చెప్పడానికి ప్రయత్నించినవాడాయన. ఇటాలియన్ కమ్యూనిస్టు, నాయకుడు పన్మిరో తోగ్లిట్టాకి రాసిన ఒక లేఖలో గ్రాంస్కీ, "In fact, it is our objective to contribute to the creating and maintaining of a unitary plan in which the diverse tendencies and personalities could gather and meld together.." అంటాడు. (ఇది నెట్‌లో అందుబాటులో ఉంది). జరిగే ప్రతీ మంచికి ఎడంగా జరుగుతూ సిద్ధాంత కళ్ళద్దాల నుండి, పార్టీల ప్రభావం నుండీ తప్పా లోకాన్ని చూడటం రాని సాంప్రదాయిక కమ్యూనిస్టులకి సరిగ్గా వ్యతిరేకంగా ప్రగతిశీల భిన్నత్వాన్ని అదెక్కడున్నా ఆహ్వానించాలనే ఈ దృక్పధం ఈరోజు మరింత అవసరం.

('జాతీయ స్ఫూర్తి' గ్రాంస్కీ ప్రత్యేక సంచికలో ప్రచురించబడింది.)

***

# అవిశ్రాంత యోధుడి చివరి మజిలీ!

# ఇండియన్ రినైజాన్స్ ఇనిస్టిట్యూట్ (హ్యూమనిస్ట్ హోమ్)

జాతీయోద్యమ నాయకులైన జతిన్‌దాస్ నుండి గాంధీ నెహ్రూల దాకా, రష్యన్ విప్లవంలోనే కాక ప్రపంచ కమ్యూనిస్టు నేతలయిన లెనిన్, స్టాలిన్‌ల వరకూ పాకిస్తాన్ నేత మహమ్మదాలీ జిన్నా మొదలుకుని చైనా చైర్మాన్ మావో దాకా, ఇంకా ఇటలీ కమ్యూనిస్టు ధీరులు ఆంటోనియో గ్రాంసీ, పల్మిరో టోగ్‌లిట్టె, హంగేరి కమ్యూనిస్టు పార్టీ స్థాపకుడు రకోసి, యుగోస్లేవియా అధ్యక్షుడు టిటో, బల్గేరియన్ కమ్యూనిస్టు నాయకులు మౌరిస్ థోరజ్, వియత్నాం అధినేత మాచిమిన్ ఇంకా చౌఎన్‌లై, చాంగేషేక్, ట్రాట్‌స్కీ... పధ్నాలుగేళ్ళ వయసులో భారత దేశ విముక్తి కోసం సరిహద్దులు దాటి చైనా, జపాన్, మలేషియా, జర్మనీ, సయాం, సుమత్ర, జావా, అమెరికా, ఫిలిప్పీన్స్, కొరియా దేశాల్లోని విప్లవోద్యమాల్లో పాల్గొని జపాన్‌లో మార్టిన్‌గా, మెక్సికోలో మిస్టర్ వైట్‌గా, రష్యాలో మాన్యూల్ మెండేజ్‌గా, అమెరికాలో గ్రేషియోగా, ఇండియాలో డాక్టర్ మహ్మద్‌గా ఉంటూ ప్రపంచంలోని మూడు ముఖ్య ఖండాల రాజకీయ విప్లవ కార్యకలాపాల్లో మునిగి తేలుతూ, ఛాంగ్రిపోటా, డైమండ్ హార్బర్, గార్డెన్ రీచ్, బెలియాఘాట్, రోడ్డా కంపెనీ, హౌరా, లాహెూర్, కాన్పూర్ మొదలగు కుట్ర కేసుల్లో ప్రధాన ముద్దాయిగా నిలిచి అనుశీలన్ సమితి నుండి, సోషలిస్టు పార్టీ, కమ్యూనిస్టు ఇంటర్నేషనల్, నేషనల్ కాంగ్రెస్, లీగ్ ఆఫ్ రాడికల్ కాంగ్రెస్ మెన్, రాడికల్ డెమోక్రటిక్ పార్టీ, రాడికల్ హ్యూమనిస్ట్ ఇంటర్నేషనల్‌గా ఎదిగి, వేన్‌గార్డ్, అడ్వాన్స్‌డ్ గార్డ్, మాసెస్ ఆఫ్ ఇండియా, మార్క్సియన్ వే, ఇండిపెండెంట్ ఇండియా, రాడికల్ హ్యూమనిస్ట్ పత్రికలు నడపడం మొదలుకుని చైనీస్, ఇంగ్లీష్, స్పానిష్, మెక్సికన్, రష్యన్, భాషల్లో లెక్కలేనన్ని గ్రంథాలు రాసి ఇండియాకు సంబంధించి పీపుల్ ప్లాన్ (ప్రజా ప్రణాళిక) మొదలుకుని డ్రాఫ్ కాన్‌స్టిట్యూషన్ రాసిన మహా మేధావి ఎమ్.ఎన్. రాయ్ డెహ్రాడూన్‌లోని దేశంలో సాంస్కృతిక వికాసోద్యమాన్ని పెంపొందించే ప్రయత్నం చేయడానికి స్థాపించిన

హ్యూమనిస్ట్ హోం, ఇండియన్ రినైజాన్స్ ఇనిస్టిట్యూట్‌లు ఆనాడు ఎంతో ప్రభావశీలమైన పాత్ర నిర్వహించాయి. రాయ్ ఆధ్వర్యంలో అనేక అధ్యయన శిబిరాలు అక్కడే జరిగాయి. వాటివల్ల తరువాతి కాలంలో అన్ని ప్రధాన ఉద్యమాల్లో ప్రగతిశీల పాత్ర పోషించిన ఎందరో ధీరులు తయారయ్యారు. రాయ్ మరణానంతరం ఎలెన్ రాయ్ చాలాకాలం అక్కడే ఉంది (తర్వాతామె అక్కడే హత్యకు గురైంది). అటువంటి అపురూప స్థలం వ్యక్తిగతంగా నాకెంతో మహత్తరవమైంది. నాటి జాడలు కాలగర్భంలో కలిసిపోగా మిగిలిన శిధిలాల్ని ఒక చూపు చూసి వెనుదిరిగాను.

**(ప్రముఖ పర్యావరణ ఉద్యమకారుడు సుందర్లాల్ బహుగుణ, విమలా బహుగుణాల్ని ఇంటర్వ్యూ చేయడానికి ఐదేళ్ళ క్రితం డెహ్రాడూన్ వెళ్ళినపుడు రినైజాన్స్ ఇనిస్టిట్యూట్‌కి వెళ్ళి అక్కడ పరిస్థితుల్ని గురించి విచారిస్తూ రాసిన రైటప్)**

***

# అద్వితీయమైన వైజ్ఞానిక సంస్థకి అమృతోత్సవం!
# భారతీయ సాంస్కృతిక పునర్వికాస కేంద్రం!!
## (ఇండియన్ రినైజాన్స్ ఇనిస్టిట్యూట్)


The house, named the **Humanist House**, where M.N. Roy and Mrs. Ellen Roy lived till their death in 1954 and 1960 respectively, at 13, Mohini Road, Dehradun, Uttarakhand

సరిగ్గా 75 ఏళ్ళ క్రితం ప్రపంచ విప్లవకారుడిగా, కమ్యూనిస్టు పార్టీ స్థాపకుడిగా, అలుపెరుగని సత్యాన్వేషిగా, అన్నింటికీ మించి తిరుగులేని మానవవాద తాత్వికుడిగా పేరొందిన ఎమ్.ఎన్. రాయ్ డెహ్రాడూన్‌లో 'ఇండియన్ రినైజాన్స్ ఇనిస్టిట్యూట్ (భారతీయ సాంస్కృతిక పునర్వికాస ప్రచార కేంద్రం) స్థాపించాడు!

బౌద్ధం మొదలుకొని చార్వాక లోకాయత ఉద్యమాల వరకూ, ఉపనిషత్ చింతన నుండి భక్తి ఉద్యమాల దాకా భారతీయ దార్శనిక దృక్పథాలకి సంబంధించిన సంవాదాలకీ, అలాగే ఆధునిక భౌతికశాస్త్ర దృక్కోణంతో కూడిన మానవవాద ప్రచారానికీ దాన్నొక కేంద్రంగా మలచాలని రాయ్ ఆశయం!

తీవ్ర జాతీయవాదంతో మొదలెట్టి, అంత ర్జాతీయ కమ్యూనిస్టు రాజకీయాలలో కూడా అత్యున్నత స్థాయికి ఎదిగిన రాయ్, తదనంతరం రాడికల్ డెమోక్రటిక్ పార్టీని స్థాపించాడు. అప్పుడే భారత రాజ్యాంగ చిత్తు ప్రతిని కూడా రాసి ప్రచురించాడు. నిరంతర భావజాల సంఘర్షణ ఆయన్ని ఏ మూసకీ పరిమితం కాకుండా కాపాడింది. అందుకే, దేశానికి స్వాతంత్ర్యం వచ్చేనాటికి, కమ్యూనిస్టు మ్యానిఫెస్టో వంద సంవత్సరాలు పూర్తి చేసుకునే నాటికీ, సరిగ్గా ఆగష్టు 15, 1947లో ప్రత్యామ్నాయ రాజకీయ అన్వేషణలో భాగంగా నవ్య మానవవాద ప్రణాళిక (New Humanist Manifesto)ని రూపొందించి విడుదల చేసాడు!

భారతీయ సమాజంలో వేళ్ళూనుకుని ఉన్న తిరోగమన మతతత్వ ఛాందస భావాలకి వ్యతిరేకంగా, హేతుబద్ధమైన, వైజ్ఞానిక ప్రగతి శీల అభ్యుదయ భావాలను నిర్మించి ప్రచారం చేయడమే ఈ సంస్థ ముఖ్య లక్ష్యం. దానినే Re educate the educators అంటాడు రాయ్. మార్పు కోసం పనిచేసే యువతరానికి దిశానిర్దేశం అందించగల ఒక సమగ్రమైన విశ్వజనీన స్థలంగా దానిని మలచడంలో రాయ్‌తో పాటు ఎలెన్ రాయ్ కృషి ఎన్నదగింది. 'హ్యూమనిస్ట్ హౌస్' గా పేరొందిన ఇండియన్ రినైజాన్స్ ఇనిస్టిట్యూట్ పేరుతో డెహ్రాడూన్‌తో పాటు ముస్సోరీలో కూడా రాయ్‌లు శిక్షణ శిబిరాల్ని నడిపారు!

దక్షిణాది రాష్ట్రాల నుండే కాక దేశ వ్యాప్తంగా అనేక ప్రాంతాల నుండి ఎందరో యువ కార్యకర్తలు, మేధావులు ఆ చర్చా కార్యక్రమాలకి హాజరయ్యారు. తర్వాత కాలంలో ప్రముఖ నాయకులుగా, హేతువాదులుగా, మానవవాద ఉద్యమ కారులుగా, హక్కుల సంఘాల నేతలుగా, సామాజిక ఆలోచనాపరులుగా, వెలిగిన ఎందరో బుద్ధిజీవులపై ఆనాటి సాంస్కృతిక వికాసోద్యమ కేంద్రం ప్రభావం ఉందంటే అతిశయోక్తి కాదు!

ప్రాచీన కాలంలో బౌద్ధ విశ్వవిద్యాలయాలైన నలంద, తక్షశిల నిర్వహించిన పాత్రను, ఆధునిక భారతీయ చరిత్రలో ఈ రినైజాన్స్ నిర్వర్తించాలని రాయ్ కోరిక. అందుకే, సాహిత్య ప్రచురణ, భావజాల ప్రచారం, పత్రికల ముద్రణ, సభలూ సమావేశాల నిర్వహణ, సంవాదాలు, కార్యశాలల రూపకల్పన మొదలైన వాటితో పటిష్టమైన ప్రత్యామ్నాయ ప్రజా స్వామ్య సాంస్కృతిక ప్రచారోద్యమ సంస్థగా కొద్ది కాలం పాటు దేశవ్యాప్తంగా ఇనిస్టిట్యూట్ ప్రధానమైన పాత్ర పోషించింది. అనేక మంది నవతరం మేధో జీవుల్ని సామాజిక స్పృహతో కూడిన సమూల మానవ వాదులుగా మల్చింది. రాసిలోనూ, వాసిలోనూ ఎన్నదగిన శక్తివంతమైన సాహిత్యాన్ని సృష్టించింది!

సాంస్కృతికంగా చైతన్యవంతమైన స్రవంతిని నిర్మించడానికి తీవ్రమైన కృషి చేసిన రినైజాన్స్ ఇనిస్టిట్యూట్‌ని రాయ్ అకాల మరణం తరువాత కూడా ఆయన సహచరి ఎలెన్ రాయ్ కొంతకాలం తన శక్తి మేరకు సంస్థ నడుపుతూ, అక్కడే ఉంది.

ఆమె హత్యకు గురైన తరువాత కూడా కొద్దిమంది అనుచరులు కొంత కాలం నడిపారు కానీ క్రమంగా అది క్షీణించింది. ప్రస్తుతం రాయ్ గురించి తెలిసిన కొందరు వ్యక్తులకి తప్పా మరెవరికీ ఈ కేంద్రం గురించి తెలియదు!

స్వాతంత్ర్యానికి పూర్వమూ, తర్వాత కూడా వైజ్ఞానిక రంగంలో, ముఖ్యంగా సైన్సు, సాంస్కృతిక ఉద్యమాలలో చెప్పుకోదగ్గ కృషి చేసిన 75 ఏళ్ళ ఈ రినైజాన్స్ ఇనిస్టిట్యూట్ గురించి, 75 ఏళ్ళ స్వాతంత్ర్యానంతరం కూడా ఎవరూ పట్టించుకోకపోవడం దారుణం. రాయ్ జీవితం నుండి, రాడికల్ హ్యూమనిజం నుండి ప్రేరణ పొందినవారిలో దేశంలోని సోషలిస్టులు మొదలుకొని, కమ్యూనిస్టుల వరకూ, కాంగ్రెస్ పార్టీ నుండి పార్టీ రహిత రాజకీయవాదుల దాకా ఎంతోమంది ఉన్నారు. అలాంటిది సైన్సు సంస్థలుగా, విజ్ఞాన శాస్త్ర ప్రచారం కోసం కృషి చేసే సంఘాలు కూడా భారతీయ వైజ్ఞానిక, సాంస్కృతిక పునరుజ్జీవనం కోసమే అంకితం అయిన రినైజాన్స్ ఇనిస్టిట్యూట్ కృషిని నేటికీ గుర్తించి ప్రస్తావించక పోవడం విచారకరం!

ఈ రోజు దేశవ్యాప్తంగా ఏవో ఒకట్రెండు పత్రికలూ, కొన్ని సంఘాలకే కానీ అసలు భారతీయ సాంస్కృతిక వికాసాన్ని ఒక ఉద్యమంగా నిబద్ధతతో నడిపిన ఇలాంటి సంస్థ ఉన్నట్లు కూడా ఎవరికీ తెలియదు. అన్నిటికంటే ఘోరమైన విషయం ఏమిటంటే, ఎన్ని విభేదాలు ఉన్నప్పటికీ లెనిన్ మొదలుకొని ఐన్‌స్టీన్ వరకూ ఎంతోమందిని తన అద్వితీయ వ్యక్తిత్వంతో ఆకర్షించిన ఎం.ఎన్. రాయ్ సమాధిని కూడా, ఇండియన్ రినైజాన్స్ ఇనిస్టిట్యూట్ నుండి ధ్వంసం చేసారు. జీవితాంతం మతతత్వాన్ని మట్టుపెట్టడం కోసమే పోరాడిన రాయ్‌ని, ముఖ్యంగా  సాంస్కృతిక మానవ వాదాన్నే నినాదంగా తలకెత్తుకుని కృషి చేసిన 'ఇండియన్ రినైజాన్స్ ఇనిస్టిట్యూట్'ని స్మరించుకోవడం, ఆ స్ఫూర్తితో దేశంలోని వివిధ ప్రాంతాలలో ఈ రకమైన ప్రగతిశీల ప్రజాతంత్ర భావజాల వ్యవస్థలను బలోపేతం చేసుకునే దిశగా భారతీయ చారిత్రక చింతనాత్మక ధోరణుల్నీ, ఆధునిక మానవీయ విధానాల వెలుగులో పునర్నిర్మించుకోవడం, మతోన్మాదం కొత్త రూపాల్లో పెచ్చరిల్లుతున్న ప్రస్తుత పరిస్థితులలో అన్ని అభ్యుదయ శ్రేణుల తక్షణావసరం అని నా భావం!

(1946లో స్థాపించబడిన ఇండియన్ రినైజాన్స్ ఇనిస్టిట్యూట్‌కి 75 సంవత్సరాలు పూర్తైన సందర్భంగా, ఈ చిన్న రైటప్)

***

# ముగింపు

ఆస్ట్రియాలోని వియన్నాలో వందేళ్ళక్రితం పుట్టిన లియార్డ్ ఫిషర్ స్వామి అగేహానంద భారతి పేరిట హైందవ సన్యాసిగా ప్రసిద్ధుడు. ముప్పై ఏళ్ళ క్రితం న్యూయార్క్‌లో చనిపోయిన భారతి The Ochre Robe పేరిట తన ఆత్మకథ రాసాడు. భారతదేశంలో  దానిని నిషేధించారు. (ఇప్పుడు అంతర్జాలంలో అందుబాటులో ఉంది). అందులో "Roy was heterodox on all counts : as a Indian nationalist, for he despised nationalism; as a Hindu, for he detested the Social trappings of Hinduism; as a communist whose apostasy from communism put him on the blackest of the Communist blacklists" అంటూ "But he had a deep love and reverence of the religious philosophers of India." అంటారు. అంతేకాదు దశనమి శాఖకు చెందిన శంకరాచార్యుడు నిజానికి తాత్విక భౌతికవాదని రాయ్ అభిప్రాయపడినట్లు చెప్తారు.

యాంత్రిక భౌతికవాదానికి, మానవీయ దార్శనిక మార్గాలకి తేడా గుర్తించిన అరుదయిన భారతీయ వైతాళికుడు మానవేంద్రనాథ్ రాయ్. ఆయన్ని విస్మరించడం సమాజ వైజ్ఞానిక అనారోగ్యానికి చిహ్నం. సైద్ధాంతిక విభేధాల్ని కూడా వ్యక్తిగత రాద్ధాంతాలుగా మల్చుకున్న గతానికి ఒక దండం పెట్టి ఈరోజు పేట్రేగిపోతున్న మత మూఢత్వానికి బదులుగా మానవవాద మార్గాలన్నింటినీ బలపర్చడం మనుషులందరి కర్తవ్యం. అందులో రవంత భాగమే ఈ చిన్న పొత్తం. గతంలోని వ్యాసాలే కాన పొరపాట్లు, పునశ్చరణలు వచ్చి ఉండవచ్చు. హడావుడిలో దొర్లిన అచ్చుతప్పులకూ వాక్య నిర్మాణ లోపాలకూ పూర్తి బాధ్యత మాదే. ఇది చదివిన వ్యక్తి ఒక్కరయినా మనిషి పక్షాన నిలిచేందుకు ముందుకొస్తే, అంతకు మించిన సార్థకత ఈ అక్షరాలకి మరోటి లేదు. అన్వేషణే పరమావధిగా సాగిన మహామానవుడి స్మృతికి మనవంతు ఇవ్వగలిగే అంతిమ నివాళి అటువంటి అంతరాత్మల్ని ప్రజ్వలింపజేసే సమూల మార్పేనని నా అభిప్రాయం. సెలవు.

## ఇతర ప్రచురణలు

1. ప్రజాస్వామ్య పతనం
2. అరాజకత్వం అంటే ఏమిటి?
3. సాంఘిక తత్వం – వైప్లవ మార్గం
4. ఒక నాస్తికుడి నామా
5. ప్రజాస్వామ్య ప్రస్థానం
6. అస్థిత్వం–అరాజకత్వం
7. మద్యంపై యుద్ధం
8. మతానికి మరణశాసనం–మనిషికి పునరుజ్జీవనం
9. కరపత్రాల కథా కమామీషు (కరపత్రాల సంపుటి)
10. తత్వ విచారణ–తర్క వివేచన
11. కులానికో సవాలు
12. ప్రకృతి–శాస్త్రం–సమాజం
13. హేతువాద దృక్పథం–విధానపర కర్తవ్యం
14. కలాలు కరపత్రాలు
15. పార్టీరహిత ప్రజాస్వామ్యం సాధ్యమా?
16. శిధిలాక్షరం (కవితా సంపుటి)
17. వ్యవస్థలు – వ్యసనాలు
18. ప్రజా ఉద్యమాల ప్రాతిపదిక
19. తరగతి గది తత్వశాస్త్రం
20. అభివ్యక్తి
21. సాఫల్య జీవులు (ప్రసంగ వ్యాసాలు)
22. భారతదేశ పతనానికి ప్రధాన కారణం : కులం

## ఇంటర్వ్యూలు – పరిచయాలు

23. ధిక్కార స్వరాలు (భావోద్యమకారుల ఇంటర్వ్యూలు)
24. విస్తృత స్వరాలు (కొందరు గాంధేయవాదుల ఇంటర్వ్యూలు)
25. సద్ధమ్మ స్వరాలు (కొందరు బౌద్ధోద్యమకారుల ఇంటర్వ్యూలు)
26. ధీరోదాత్తులు (కొద్దిమంది సామాజిక కార్యకర్తల పరిచయాలు)
27. మరువలేని మనుషులు–మరుపురాని జ్ఞాపకాలు
28. ప్రకృతి శాశ్వత ప్రగతి (సుందర్లాల్ బహుగుణ ఇంటర్వ్యూ)
29. రాజీలేని ధిక్కార పతాకాలు (కొద్దిమంది సామ్యవాదుల పరిచయాలు)

## సంపాదకత్వం - సంకలనాలు

30. మద్యపానమా? మానవత్వమా? (మద్యం గూర్చి మహిళల వ్యాసాలు)
31. మానవతకు భరోస (మ.వ్య.ప్ర.స. అర్ధ దశాబ్ద్యుత్సవ సావనీర్)
32. సహృదీయం (సహృదయ మిత్రమండలి 15 సం॥రాల సావనీర్)
33. పేదల కలలు (అనువాద కథా సంకలనం)
34. సంస్కృతి (సంక్షోభాలు-సంవాదాలు)
35. ప్రత్యామ్నాయ సినిమాలు (దృక్పథాలు-దృక్కోణాలు)
36. మానవీయ ఆసరా స్వరం : మద్యపాన వ్యతిరేకోద్యమం
37. భారతదేశ ప్రజలమైన మేము... (70 సం॥రాల రాజ్యాంగంపై వ్యాసాలు)
38. చదువు అంటే ఏమిటి? చదువులెందుకు? (విద్యపై విభిన్న భావాలు)
39. ప్రజలు - కళలు (ప్రత్యామ్నాయ ప్రజాకళాతత్వ వ్యాస సంకలనం)
40. ఆంధ్రరాష్ట్ర సాంఘిక సంస్కర్తలు... (పి.హెచ్. గుప్తా, పునర్ముద్రణ-వ్యాసం)
41. భారతదేశంలో వందేళ్ళ కమ్యూనిజం (విధానాలు-వైఖరులు)
42. నవభారత యువ దిక్సూచి.. భగత్సింగ్ (90వ వర్ధంతి ప్రత్యేక వ్యాస సంకలనం)
43. కుల నిర్మూలన కోసం: అభిప్రాయాలు-ఆలోచనలు (కుల నిర్మూలనకి 85 సం॥లు)
44. పరాయీకరణ (పరిణామాలు - పర్యవసానాలు)
45. శ్రమైక జీవన సంస్కృతి (ప్రత్యామ్నాయ సంస్కృతిపై ప్రముఖుల ప్రసంగాలు)

## అనువాదాలు

46. పురుషుడు-స్త్రీ (చలం ఏకైక ఆంగ్ల వ్యాసం తెలుగులో)
47. సంపూర్ణ ప్రజాస్వామ్యం దిశగా... (లోక్‌నాయక్ జె.పి. వ్యాసం)
48. శాస్త్రీయ హేతువాద సామ్యవాది: వివేకానంద (దత్తప్రసాద్ దభోల్కర్ రచన)
49. సాలీడు-ఈగ (విలియం లిబ్నిక్ కథ తెలుగులో)
50. నంది మూపురం (డి.డి. కౌశాంబి పిల్లల కోసం రాసిన ఏకైక కథ)
51. ఎక్కడ మనసు నిర్భయంగా ఉంటుందో... (ఠాగోర్ కవితా విశ్లేషణ)
52. చారిత్రక మహోద్యమం-చంపారన్ సత్యాగ్రహం (శతవార్షికోత్సవ ప్రచురణ)
53. స్వేచ్ఛ-సాంస్కృతిక ఆవశ్యకత (ఎమ్మెన్ రాయ్ రచన)
54. మన విద్యా సమస్య (లాలా లజపతిరాయ్ వ్యాసం)
55. జీవితానికి అర్థం ఏమిటి? (ఆచార్య నరేంద్రదేవ్, లోహియా రచనలు)
56. అభివృద్ధి - ఆదివాసులు - హింస (హిమాంశు కుమార్ రచన)
57. మనిషి-మార్జాలం (కానర్డ్ లోర్నెంజ్ కథ)
58. సినిమా కార్యకర్తల కరదీపిక (చల్తీ తస్వీరే ప్రచురణ)
59. నేను-ప్రజలు-ప్రపంచం (పిఠాపురం యువరాజా ఆత్మకథ)
60. భారతదేశంలో బౌద్ధ పతనం (అంబేద్కర్, రాహుల్జీల రచన)
61. అనారోగ్యాన్ని పండగ చేసుకుందాం... (తమిళ తాత్వికుడు నమ్మళ్వార్ రచన అనువాదం)
62. భారతదేశ విముక్తి మార్గం - బౌద్ధం (అంబేద్కర్ 5 బౌద్ధ ప్రసంగాలు)